శ్రీరస్తు.

బమ్మెరపోతనామాత్యప్రణీత

శ్రీమదాంధ్ర మహాభాగవతము నందలి

# సప్తమస్కంధము.

ఇది,

తెనుఁగుభాషఁజదువుకొను బాలురకు

నత్యంతోపయుక్తంబగునటుల

ఆల్లాడి- నారాయణశాస్త్రులు-వారిచే

పరిష్కరింపఁబడి

రామానందముద్రాక్షరశాలయందు.

ముద్రింపించి ప్రచురింపఁబడియె.

చెన్నపురి,

1904

శ్రీరామానంద ముద్రాక్షరశాలయందు విక్రయించు

## పుస్తకముల జాబితా.

| | |
|---|---|
| సేనాని చరిత్రము | ౦ ౩ ౦ |
| గురుబాలప్రబోధిక | ౧ ౮ ౦ |
| తె॥ ఇందసభా | ౦ ౫ ౦ |
| సుజ్ఞానామృతతారావళి | ౦ ౪ ౦ |
| పురశ్చరణదీపిక | ౦ ౪ ౦ |
| అష్టోత్తరసహస్రనామకదంబము | ౦ ౮ ౦ |
| స్కాందమాఘపురాణం | ౦ ౮ ౦ |
| కాలామృతం | ౦ ౪ ౦ |
| నక్షత్రచూడామణి | ౦ ౪ ౦ |

పాకెట్టురాయల్ ౩౨ పేజీలలోయుండు గ్రంధములు

| | |
|---|---|
| విష్ణుసహస్రనామము | ౦ ౭ ౦ |
| లలితాసహస్రనామము | ౦ ౬ ౦ |
| శివసహస్రనామము | ౦ ౬ ౦ |
| భగవద్గీత భారతసావిత్రోపాఖ్యానంబ్రహ్మసూత్రం | ౦ ౮ ౦ |

ఇవి మొదలైన అనేక సంస్కృతాంధ్ర గ్రంథములు సరసముగా విక్రయించబడును పోస్టుచార్జి ప్రత్యేకము,

ఇట్లు

అల్లాడి - హయగ్రీవశాస్త్రి

రామానంద ముద్రాక్షరశాల

చాకలపేట పోస్టు.

శ్వరుండు సృజియింపంగోరి రజంబునఁ గ్రీడింపంగోరి సత్వంబున నిద్రింపఁగోరి త
మంబు నుత్పాదించి చరమైన కాలంబున సృజియించుచు నా కాలమున సర్వదర్శ
నుండైన యీశ్వరుండు కాలాహ్వయుండైన సత్వగుణంబైన దేవానీకంబునకు
వృద్ధియు రజస్తమోగుణులైన రాక్షసులకు హానియుం జేయుచుండు॥ క॥ జన
నాయక యీయర్థము । ఘనయశుఁడగు ధర్మజునకుఁ గ్రతుకాలమునన్ । మును
నారదుండు సెప్పెను । వినుపించెద వినుము చెవులు విమలత నొందన్॥ వ॥ ము
న్ను ధర్మరాజు సేయు రాజసూయయాగంబున బాలుండైన శిశుపాలుఁడు హ
రి నిందించి నిశితనిర్వక్రచక్రధారాదళితమస్తకుండయి తేజోరూపంబున వ
చ్చి హరిదేహంబు సొచ్చుటం జూచి వెఱఁగుపడి ధర్మజుండు సభలోనున్న నార
దు నీక్షించి యిట్లనియె॥ గీ॥ ఏట్టివారికైన నేకాంతులకునైన । వచ్చి చొరఁగ
రాని వాసుదేవతత్వమందుఁ జేరె ధరణీశుఁ డహితుఁడై । యెట్లు చొచ్చె మునివరే
ణ్యా నేఁడు॥ ఉ॥ వేఁడు మాధవుఁ దెగడి విప్రులు దిట్టి భగ్నుఁడై తమో । లీను
ఁడు గాఁడె తొల్లి మదలింపుచు చైద్యుడు పిన్ననాఁటనుం । డే యుమాధవున్ వస
హింపఁడు భక్తి వహింప డట్టివాఁ । డేని డప్రభావమున నీపరమేశ్వరు నందు జొ
చ్చెనో॥ మ॥ హరిసాధింతు హరిన్ గ్రహింతు హరి ప్రాణాంతంబు నొందింతు దా
హరికిన్ వైరినటంచు వీఁకఁబటురోషాయత్తుఁడై యెప్పుడున్। దిరుగుం బ్రువ్వఁడు
నోరు ప్రీలిపడదో దేహంబు దాహంబుతో । నరకావాసము నొందఁ డేక్రియ జగ
న్నాథుం బ్రవేశించెనో॥ వ॥ అదియునుం గాక దంతవక్త్రుండును వీఁడును నిరం
తరంబు గోవిందు నింద సేయుదురు నిఖిలజనులు సందర్శింప నేఁడు వీరికి విష్ణుసా
యుజ్యంబు గలుగుట కేమి హేతువు వినిపింపుము పవనచలితదీపశిఖయుంబో
లె నా హృదయంబు చలించుచున్నదనిన ధర్మనందనునకు నారదుండిట్లనియె॥
దూషణభూషణతిరస్కారంబులు శరీరంబునకుం గాని పరమాత్మకు లేవు శరీ
రాభిమానంబునం జేసి దండవాక్పారుష్యంబులు హింసయై తోఁచు తెఱంగున నే
ను నా యదీయ యను వైషమ్యంబు భూతంబులకు శరీరంబునందు సంభవించు న
భిమానంబు బంధంబు నిరభిమానుండై వధించిన వధంబు గాదు కర్తృత్వమొల్లవ
ి వానికి హింసయు సిద్ధింపదు సర్వభూతాత్మకుండయిన యీశ్వరునికి వైష
మ్యంబు లేదు గావున॥ గీ॥ అలుకనైన జెలిమినైన గామంబున । నైన బాంధవ
ముననైన భీతి । నైన దగిలి తలఁప నఖిలాత్ముఁడగు హరి । జేరవచ్చు వేఱు సేయఁడత
ఁడు॥ క॥ వైరానుబంధనంబున । జేరినచందమున విష్ణుఁ జిరతరభక్తిన్ । జేరఁగ
రాదని తోఁచును । నారాయణభక్తియుక్తి నా చిత్తమునన్॥ క॥ కీటకము దెచ్చి

భ్రమరము। పాటవమున బంభ్రమింప భ్రాంతం బైతే। కీటకము భ్రమరరూపము। పాటించి వహించుగాదె భయయోగమునన్॥ ఇవ్విధంబున॥ శా॥ కామోత్కంఠత గోపికల్ భయమునం గంసుండు వైరక్రియా। సామగ్రిన్ శిశుపాలముఖ్యనృపతుల్ సంబంధులై వృష్ణులున్। ప్రేమన్మీరలు భక్తినేమునిటచక్రిం గంటిమెట్లైనను। ధ్యాసధ్యాసగరిష్ఠుండైన హరి జెందవచ్చు ధాత్రీశ్వరా॥

శ్రీహరిద్వారపాలకులగు జయవిజయులకు సనందనాదులవలన శాపంబు సంభవించుట.

వ॥ మఱియుం బెక్కండ్రు కామద్వేషభయస్నేహ సేవాతిరేకంబులం జిత్తంబు హరిపరాయత్తంబుగా జేసి సద్గతిం జెందిరి వారి నుద్దేశించి క్రోధామత్తంబు ... లేనింటిలోపల నొక్కంటియైన వెన్నునికి లేనినిమిత్తంబున నతండు వ్యర్థుండయ్యె పితల్లి చెలియలికొడుకులైన శిశుపాలదంతవక్త్రులు తొల్లి విష్ణుమందిర ద్వారపాలకులు విప్రశాపంబున బరభ్రష్టులై భూతలంబున జన్మించిరని విని యుధిష్ఠిరుండు నారదున కిట్లనియె॥ మ॥ అలుగం గారణమేమి విప్రులకు మూర్ఖవిప్రులెవ్వారుని। చ్ఛలులే కాంతు సన్నిర్జితేంద్రియులు నిస్సంసారులై కామవర్జితులు వైకుంఠపురీనివాసుల నవిందున్వారి కేభ్భంగిని। ఖిలజన్మంబుల వచ్చు వారదవిలున్ సంకౌతూహలంబ య్యెడిన్॥ వ॥ అనిన నారదుం డిట్లనియె నొక్కనాడు బ్రహ్మమానసపుత్త్రులైన సనకసనందనాదులు దైవయోగంబున భువనత్రయంబునం దును సంచరించుచు నైదాఱేండ్లప్రాయంపు బాలకుల భావంబున దిగంబరుల యి హరిమందిరంబునకు వచ్చి చొచ్చునెడ మొగసాలనున్న పురుషులిద్దఱు వారలం జూచి॥ క॥ డింభకుల ననఁగ నెఱవి। సంభకులర మాధిపాధనల్లాపము ఖారంభకుల ముక్తనూన సద్రాభకులం జొరగనీక తెలిమిరధిశా॥ క॥ వారించిన ఖారంభకుల ముక్తనూన... దమకంబున। వారించు నిలువ లేక పడిదిట్టిరిదా। వారికులనసుర యోనిస। వారిత లై పుట్టుడనుచు వసుధాధిశా॥ వ॥ మఱియు నాపిన్నపెద్దలు వారలంజూచి మీరలిద్దఱు నుంసహరులుగారు నారాయణచరణ మూలంబు విడిచి రజస్తమోగుణులకు రాక్షసియోనిం బుట్టుడని శపియించిన నాశాపవశంబున బరభ్రష్టులై కూలుచు మొరలిడిన నమ్మహాత్ములు దయాళువులై క్రమ్మఱ నంగరుణించి మూడు జన్మంబులకు వైరంబున భగవత్సన్నిధానంబు గలిగెడు ననినిర్దేశించి చనిరి య్విధంబున శాపహతులై హరిపార్శ్వచరులైన పురుషులిద్దఱు హిరణ్యకశిపుహిరణ్యాక్షులన దితికి జన్మించిరందు గనిష్ఠుండయిన హిరణ్యాక్షుని హరి వరాహరూపంబున సంహరించె నగ్రజుండయిన హిరణ్యకశిపుం డనునరసింహమూర్తియైన శ్రీ

సంస్మరణంబున యోగవియోగంబులనొందించు సంభవవినాశశోకవివేకావివేకచింతాస్మరణంబులు వివిధంబులీయర్థంబునకు పెద్దలు ప్రేతబంధుయమసంవాదంబను నితిహాసంబును దాహరింతురు వినుండు సెప్పెద నుశీనరదేశంబునందు సుయజ్ఞుండను రాజొకండు శత్రువులచేత యుద్ధంబున నిహతుండై యున్నయెడ. సీ॥ చినిగినబహురత్నచిత్రవర్మముతోడ రాలినభూషణరాజితోడ భీకరబాణనిర్భిన్నవక్షముతోడ దొలుచుగారెడు శోణితంబుతోడ। గీర్ణమై జారిన కేశబంధముతోడ రోషసందష్టాధరంబుతోడ। నిమిషహీనంబైన నేత్రయుగ్మముతోడ భూరజోయుతముఖాంబుజముతోడ। దునిసిపడిన దీర్ఘదోర్దండములతోడ। జీవరహితుడగు నుశీనరేంద్రు। జుట్టిబంధుజనులు సారెదినుండగ భయభ్రాంతలెల్ల॥ శా॥ ప్రస్తాకంపితకేశబంధములతో సంఛిన్నహారాళితో। హస్తాబ్జంబులు సాచి మోదికొనుచున్ హా నాథయంచున్ బహు। ప్రస్తావోక్తులతోడ నేడ్చి రివగన్ ప్రాణేశుపాదంబుపై। నస్తోక స్తనకుంకుమారుణవికీర్ణ ప్రంబువర్షించుచున్॥ మ॥ అవస్థ నిన్ను నుశీనరప్రజలకర్థానందసంధాలుగా। మునునిర్మించిన బ్రహ్మ నిర్దయతను జూలించె నేవీరికి। దన్నయ శ్రేణికి మాకు దిక్కుగలదే ధాత్రీశ నీ కోటికిం। జను నే పాసి చనంగ భాత్రుపమలన్ సస్త్రులబుత్రులన్॥ మ॥ జనలోకేశ్వర నిన్ను బాసిన నిమేషంబున్ మహాబ్జంబులై। చనులోకాంతరగామివై మఱలకీచందంబున న్నీవు పోయిరనెబ్బగి జాతుమెల్లముగ దాయిలోకవృత్తంబునే। దపలజ్వాలల జొచ్చి వచ్చెదము నీ యంఘ్రిద్వయంబు జూడగన్॥ అని యిట్లు రాజభార్యలా రాజశవంబు డగ్గఱి విలపింపం బ్రొద్దుగుంకె నీ సమయంబున వారుల విలాపంబులవిని బాలకుండై యముండు సనుదెంచి ప్రేతబంధులం జూచి యిట్లనియె॥ ఉ॥ మచ్చిక వీరికెల్ల బహుమాత్రము చోద్యము దేహపుట్టుచున్ జచ్చుచునుండ జూచెదరు చావునకొల్లడగవచ్చునే వెచ్చటబట్టినచ్చటికి చేగుటనై జను ప్రాణకోటికిన్॥ క॥ జననీజనకుల బాసియు। ఘనవృకముల బాధపడక గడుబిన్నలమే। మనియెద మెవ్వడు గర్భంబునమును బోషించె వాడె పోషకుడడవిన్॥ క॥ ఎవ్వడు సృజించు బ్రాణుల। నెవ్వడు రక్షించు ద్రుంచునెవ్వడు పంతుండెవ్వడు విభుడెవ్వడు వా। డివ్విధమనమనుచుబెనుచు హేలారతుడై॥ గీ॥ ధనముపీధిబడిన దైవవశంబున। నుండ బోవు మూలమున్ననైన। నడవిరక్ష లేనియబలుండు వర్ధిల్లు। రక్షితుడు మందిరమున జచ్చు॥ క॥ కలుగును మఱిలేకుండును। గలభూతములెల్లగాలకర్మవశములయి। నిలువండు ప్రకృతింతద్గుణకలితుడు గాడాత్మ మయుండగమ్యుడు దలపన్॥ సీ॥ పాంచభౌతికమైన భవనంబు దేహంబుపురు

హైనవిధి నేమందురా॥ ఉ॥ ఆకొంకులు రావుపిల్లలకు। తేపటిను డియుమేతగానమిరా బోకుచుగూటిలో నెగసిపోవగ నేరవు మున్న కల్లియే। దిక్కు ననుండివచ్చున న।త్రిప్పనిచూపులనిక్కి నిక్కి నల్దిక్కులు చూచుచున్న వతిదీనత నెట్లు ధరింతు నకటా॥ అనివిర్ధంబున॥ క॥ కుంతితవాదముతోడను। గంతము వోషింబవగ చుఖగము చెహానన్॥తొలరుండై నకిరాతుడ కంఠిరగతి నేశుగాక్క కోలంధరగూలెఖగము ఘోషముతోడన్। గాలము డాసిన నేలగూలక పోవశమె యెట్టిగుణపంతులకున్॥ ఉ॥ గావునమీరుచచ్చుతరిగానరుచచ్చెదరి త్రిబద్ధథా। త్రివిధు దేహాముం గదిసిదీనత నేడువ నేలపొందుచి। తావతులార వత్సర శతంబున కైనని జేశుచకిం కిం। బోవుటదుర్లభంబు మృతిబొందిన వారలు సేరవత్తురే॥ వ॥ అని ఇట్లు కపట శాలకుండైన క్రీడించుచున్న యముని యుపలాలనాలాపంబులువినిసుయజ్ఞునిబంధువులెల్ల వెరగుపడి సర్వప్రపంచంబు నిత్యంబుగాదనితలంచి శోకంబుమానిసుయజ్ఞునిసాంపరాయికకృత్యంబులు సేసి చనిరంత నంతకుండంతర్హితుండయ్యెనని చెప్పి హిరణ్యకశిపుండు దనతల్లినిదమ్మని భార్యలంజూచి ఇట్లనియె॥ క॥ పరులెవ్వరు దామెవ్వరు। పరికింపగ నేకమగుట భావింపరుత। ప్పరమనజ్ఞానము లేమిని। బరులును మేమనుచుదోచు ప్రాణులకెల్ల॥ వ॥ అని తెలియబలికిన హిరణ్యకశిపుని వచనంబులువినిదితికోడండ్రునుం దానును శోకంబుమానితత్త్వవిలోకనంబు గలిగిలోకనంబుగలిగిలోకాంతరగతుండైన కొడుకునకు వగవక చనియెనని చెప్పి నారదుండుధర్మనందను కిట్లనియె॥ క॥ అజరామర భావంబును। త్రిజగద్రాజ్యంబు నప్రతిద్వంద్వముదో।ర్విజితాఖిలశాత్రవమును। గజరిపుబలమును హిరణ్యకశిపుడు గోరెన్॥ వ॥ ఇట్లు గోరి మందరాచలద్రోణికిం జనియందు గాలి పెనుద్రేవ నేల నిలువంబడి యూర్ధ్వబాహుండై మిన్ను జూచుచు వాడిమయూఖంబులతోడి ప్రళయకాలభానుండునుంబోలె దీర్ఘజటారుణప్రభాజాలంబులతోడ నెవ్వరికిం జేరిజూడ రాక పరమదారుణంబైన తపంబు సేయుచుండె నిర్జరులు నిజస్థానంబుననుండిరంత॥ మ॥ అదరెగుంభినిసాద్రియై కలగె నేడంభోనిధుల్తారకల్ ప్పెదరెన్ గ్రహసంఘమెల్ల దిశలు విచ్చెన్ మంటలై మండెదిక్ బ్దదరెన్ గుండెలు జంతుసంహతికిను గ్రాజారదైత్యేంద్రమూర్ధన్యదిశోద్గత సధూమహేతిపటలోదంచత్తపోవహ్నిచేన్॥ వ॥ ఇట్లు త్రైలోక్య సంతాపకరంబైన దైత్యరాజతపోదహనవిజృంభణంబు సైరింపక నీలింపులు నాకంబు విడిచి బ్రహ్మలోకంబునకు జనిలోకేశ్వరుండైన బ్రహ్మకు వినతులై ఇట్లని విన్నవించిరి॥ క॥ దితికొడుకు తపము వేడిమి। నతితప్తుల మైతిమింక నలజడి నమరావతినుండ వెరతుము దెవ్వదిగతి మాకిట దేవ

దేవ కారుణ్యనిధి॥ మ॥ శంకాలేశము లేదు దేవ త్రిజగత్సంహారముం జేవ తా। సం
కోచంబును వేదశాస్త్రపదవిసంక్షేపముం జాల నేవంకన్ జేతునటంచు మ స్సహా
తపోవ్యాప్తిత్రిచిత్తంబులో। సంకల్పించెని శాచరుండు ప్రతిసంస్కార బుజిం
తింప వే॥ శా॥ నీ వేరీతి దపోబలంబున జగన్నిర్మాణముం జేసి ఈ దేవాధీశులకుం బె
నక్కుడు శిరిం దీపించి తిబ్భంగి దా। నీ విశ్వంబు తపస్సమాధిమహిమన్ హింసించి
పేరొక్కవి। శ్వావిర్భావకత్వశక్తి మదిలో నధిష్ఠించినాడీశ్వరా॥ వ॥ అదియు
నుంగాక కాలాత్మకు జీవాత్మలకనిత్యత్వంబు గలుగుటం జేసి తపోయోగసమా
ధిబలంబున నశకు నిత్యత్వంబు సంపాదింతు ననితలంచివాడని మఱియు నిట్లనియె.

—)*] బ్రహ్మదేవుండు హిరణ్యకశిపునకు వరమిచ్చుట. (*]—

మ॥ భవదీయంబగు మన్నతోన్నతమహాబ్రహ్మాపీఠంబు నం। స్తవనీయం
బగు భూతియు న్విభవము న్సౌఖ్యంబు నంతోషము। న్భవనశ్రేణికి నిచ్చి దైత్యోత్త
వస్ఫూర్తిన్నివారించి యో భువనాధీశ్వర కావవే సువనము ల్పూర్ణప్రసాదం
బునన్॥ వ॥ అని దేవతలు విన్నవించిన న్యయంభూతుండు సుభవంతుండునై హంస
లు మొగంబుల వేల్పుల ప్రోడ భృగుదక్షాదులతోడ మందర పర్వతంబునకు వచ్చి
యందు నియమయుక్తుండు చిప్పిలికావృత మేదోమాంసచర్మరక్తుండును వల్మీ
కృతణవేణుపటలపరిచ్ఛన్నుండును మహాతపఃప్రభావసంపన్నుండునై రంప్ర
బిడ నీరద నీకర వినిరజబంధుండునుం బోలె నివసించియున్న నిజగిరారాతిం జూ
చి వెరగుపడి నగుచు నిట్లనియె॥ మత్తకోకిల॥ ఓసురారికులేంద్ర నీ క్రియను గ్రమై
నతపంబు ము। జేసి చూపిన వారు లేరిక జేయువారును లేరు నే। నీ సమాధికి మెచ్చి
తిన్వైన నీయభీష్టము లిత్తునా। యాస మేటికి తెమ్ము వేగ మహాత్మ కోరుము కోరికల్
శా॥ దంశవ్రాతములు న్పిపీలికలు మేదఃప్రవ్రరక్తంబుల। న్పంశీర్ణంబులు సేసి పట్టి
తినంగా శల్యావశిష్టుండవై। వంశచ్ఛన్నతృణావళీయుత మహావల్మీ మందిప్రదియ
భ్రింశం బింతయు లేక నీవు నిలువం బ్రాణంబు లెట్లుండెనో॥ ఉ॥ ఉత్సుకతం జలాన్న
ములనొల్లక నీ క్రియ నూఱుదివ్యసం। వత్సరముల్ శరీరమున వాయువులున్నిలుపం
గవచ్చునే। యుత్సవమయ్యె మాకు మమున్ గ్రతపంబున గెల్చితీవు నేవత్సలతన్ని
ముగదియవచ్చితి గోరికెల్ల నిచ్చెదన్॥ వ॥ అనిపలికి నముత్కీ కాపిపీలికాభక్షిత
బైనరక్షోవిభుని దేహంబు మీదం గమండలుజలంబులు ప్రోక్షించిన నద్ధాన వేం
ద్రుండు కమలాననకరకమలకమనీయకనకమయదివ్యామోఘకమండలునిర్గత
నిర్మలనిరధారాబిందుసందోహసంసిక్తసకలాంగుఁడై తపంబు చాలించి సాంద్ర
కీచకసంఘాతసంఛాదిత వామలూరుమధ్యంబు వెలువడి మహాప్రభాబలసౌంద

దుర్లభములీయర్థంబులెవ్వారికి। న్నన్నవ్వారలుగోరరివరములనొసంగెదించి
తిన్నయెడ। నన్నుంగోరినవెల్లనిచ్చితి ప్రవీణత్వంబుతో బుద్ధినం। పన్నత్వంబున
నుండుమీసుమతివై భద్రశీలుండవై వ॥ అని ఇట్లు మోఘుంబులైనవరంబులి
చ్చి దితినందనుచేతంబూజితుండై యరవిందసంభవుండుబృందారకసందోహ
వంద్యమానుండగుచునిజమందిరంబునకుంజనియెనివ్విధంబుననిలింపారాతివర
పరంపరలుసంపాదించుకొని॥ క॥ సోదరుజంపినపగకై। యాదరమించుకయులేక
యసురేంద్రుండుకం। జోదరుపై వైరము దు। ర్వారతఁ దగుచు జేసెమనుజా
ధీశా॥ సీ॥ ఒకనాఁడు గంధర్వయూథంబుపరిమార్చు దివిజులనొకనాఁడు దెరలఁదో
లు। భుజగులనొకనాఁడుభోగంబులకుబాపు గ్రహములనొకనాఁడుగట్టివేచు। నొ
కనాఁడు యక్షులనుగ్రతదండించునొకనాఁడువిహగులనొడిసిపట్టు। నొకనాఁడుసి
ద్ధులనొడించిబంధించు మనుజులనొకనాఁడుమర్దించు। గడిమి నొకనాఁడకిన్నర
ఖచర సాధ్య। చారణప్రేతభూతపిశాచవన్య। సత్వవిగద్యాధరాదులసంహరించు
దితినసూనుండుదుస్సహతేజుఁడగుచు॥ క॥ అట్లీతోడగోళ్లల। గట్టనుకం
ద్రోచిక్రవ్యాదులతో। జుట్టువిడిసిదిక్పాలురపట్టణములుగొనియొనతకుబలమున
నధిపా॥ క॥ కృశులై సంప్రాపితదు। ర్దశులై సర్వంకభోగ్రదైతేయాజ్ఞా। పశులై నిశలు
నుదివములు। దిశలెల్లనుగట్టువడియిదీ తపనఘా॥ వ॥ మఱియునద్దానవేంద్రుం
డు విద్రుమసోపానంబులును మరకతమణిమయప్రదేశంబులును వైడూర్యర
త్న స్తంభసముదయంబులును- చంద్రికాసన్నిభస్ఫటికసంఘటితకుడ్యంబులు
నుపద్మరాగపీఠకనకవాటగేహాళివిటంకవాతాయనంబులును-విలంబమానము
క్తాఫలదామవితానశోభితధవళపర్యంకంబులును- వివిధవిచిత్రవిమానంబులు
ను నిరంతరసురభికుసుమఫలభరితపాదపహిమోద్యానంబులును- హేమారవిం
దసౌగంధికబంధురసరోవరంబులును-రమణీయరత్నప్రాసాదవిశేషంబులుమ
నోహాలపరిమళశీతలమందమారుతంబులును- మృదుమధురనినదకీరకోకిల
కులకోలాహలంబులునుగలిగి విశ్వకర్మనిర్మితంబై త్రైలోక్యరాజ్యలక్ష్మీశో
భితంబైన మహేంద్రభవనంబుజొచ్చి॥ మ॥ దితిపుత్రుండుజగత్త్రయైకవిభుఁడై
దేవేంద్రసింహాసనో। ద్ధతుడై యుండహరాచ్యుతాంబుజభవుల్ దప్పంగభీతిస్స
యా। గతులై తక్కినయక్షకిన్నరమరుద్గంధర్వసిద్ధాదులానతులై కానికలిచ్చి
కొలురతనిన్నానాప్రకారంబులన్॥ శా॥ యేదిక్పాలురజూచినేడలుగునో యే
దేవుబంధించునో। యేదిగ్భాగముమీఱదాడిచనునో యేప్రాణులంజంపునో।
యీదయితేశ్వరుఁడంచునొండొరులుదారింద్రిదులార్తాభ్రా। వేదిన్మల్ల

పనిక్కిచూతురుభయా నిభూర్ణతరోమాంచులై॥ సీ॥ కోలాహలము మాని
కొలువుడీసురలార కలగిదివిఁద్రుంచుతపసులార। ఘనలెత్తకుడునికి పన్నగేం
ద్రములార ప్రణుతులయినను దిక్పాలులార। గానంబుసేయుడు గంధర
వులార సఁగడిబడకుడీ సాధ్యులార। యాడుడునృత్యంబులప్సరోజను లా
ర చేరిక్రమ్మెక్కుడు సిద్ధులార। శుద్ధకర్పూరవాసిత సురభిమధుర। భక్ష్య
నూతనమై తేయపానజనిత। సుఖవిలీనతనమరారిసాక్షిన్నాడు। శాంతిలేదం
ద్రునిచ్చలుచారులధిప॥ శా॥ లీలోద్యానలతానివాసములలోఁ లీలావతీయుక్తు
డయి। హాలాపానవివర్ధమానమదవల్లావ్రత్తతామ్రాక్షుడయి। కేళీదేల
గనేసదుంబురుఁడుసంగీతప్రసంగంబుల। న్వాలాయంబుగఁజెయుఁగజేయురుము
దేవద్వేషిచకర్వశ్వరా॥ క॥ యాగములుబుధులుధరణి। భాగములంజేయుచుం
డంబఱవెంచిహవి। ర్భాగములదానసైకొనఁ। జాగింపఁడుదైత్యుఁడమరసం
ఘంబునకుఁ॥ సీ॥ సకలమహాద్వీపసహితవిశ్వంభరాస్థలినిదున్నకవ దునన్నచ
యాము। కామధేన్వాదులకరణిఁదుగ్ధంబు గోరుకోర్కులుగగనంబు గురియుచుం
డు। వసుధలేసనువాహినిసందోహములనువీచులరత్నములువహించు। సు
క్రియమాంసులకునాకర్యంబున ఖలతఁ గుణములనతిశయిల్లు। సంబసం
పూరితద్రోణులగుచునొప్పు। బర్వతంబులఁనద్యాదికాలవివిధ। గుణములెల్లను
దానైకొనుచుదైత్య। విభుండునై త్రిలోక్యరాజ్యసంవృద్ధిఁబొందె॥ వ॥ ఇట్లుస
కలదిక్కులనిజింఁచిలోకైకనాయకుండఁఘుత యచ్ఛాప్రకారంబునసింద్రి
యసుఖంబెలఁఘవిచుచుందనియౌ శాస్త్రమార్గంబునతిక్రమించి విరించి
వరజనితదుర్వారగర్వాతిరేకంమునసుపర్వారాతియై శ్వర్యవంతుండయిపెద్ద
కాలబు రాజ్యంబుసేయునెడ॥ ఉ॥ ఎన్నఁడు నాదిక్కుగలదెన్నఁడుదైత్యునిబా
ధమానమే మెన్నఁడువృద్ధిఁబొందగలమెవ్వడురక్షకుడంచుదేవతాకిన్నరసిద్ధ
సాధ్యమునిఖేచరనాయకులాశ్రయించిరా। పన్నగతల్పుభూరిభవబంధవిమో
చనఁబన్నఁగోచనుఁ॥ వ॥ ఇట్లుదానవేంద్రునియుగ్రదండంబునకువెఱచియనన్య
శరణ్యులైరహస్యంబెనందఱుంగూడుకొని॥ ఉ॥ ఎక్కడనున్నవాడుకగధీశ్వ
రుఁడాత్మనయుఁడుమాధవుం। డెక్కడికేగిశాంతులుమునీశులుబిక్షులురారు
క్రమ్మఱం। దిక్కులనెల్లనెక్కడఁదుదింపఁదిక్కగునట్టిదిక్కుకై। క్రొమ్మె
క్కదమేముహస్తయుగములుముకుళించిమదీయరక్షకుఁ॥ వ॥ అనిమఱియునా
హారనిద్రలుమానిచిత్తంబులు పలాయత్తంబులుగాక సమాహితబుద్ధులై భ
గవంతుండునుమహాపురుషుండునుమహాత్ముండును విశుద్ధజ్ఞానానందమయుం

డంబోత్తరుండతక్కవీంద్రులక్రియన్నానాథమిభోటన। భగవద్భక్తులైదైత్యరాజ
తనయుంబాటించికీర్తింపరే॥ క॥ గుణనిధియగుప్రహ్లాదుని। గుణములనేకము
లుగలవుగురుకాలమునను। గణుతింపనశక్యంబులు। ఫణిపతికిన్బృహస్పతికినిభా
షాపతికిన్॥ వ॥ ఇట్లుసద్గుణగరిష్ఠుండైన ప్రహ్లాదుండుభగవంతుండైన వాసుదే
వునియందు సహజ వర్ధమాననిరంతరధ్యానరతుండై॥ సీ॥ శ్రీవల్లభుండుదద
న్నుజేరినయట్లైనజెలికాండ్రునవ్వంగ జేరమఱచు। సురారితనమ్రోలనాడిన
ట్లైన నసురబాలురతోడనాడమఱచు। భక్తవత్సలుఁడనుసంభాషించినట్లైన నపర
భాషలకుమాఱుపలుకమఱచు। సురవంద్యుఁడనలోనజూచినయట్లైనవలోకి
తవస్తుంబుజూడమఱచు। హరిపదాంభోజయుగచింతనామృతమున। నంతరం
గంబునిండినట్లైననతడు। నిత్యపరిపూర్ణుఁడగుచునన్నియునుమఱచి। జడతలే
కయయుండునుజడునిభంగి॥ శా॥ పానీయంబులుద్రావుచుంగుడుచుచున్భా
షించుచున్హాసలీ। లానిద్రాదులుసేయుచుందిరుగుచున్లక్షించుచున్సంతత। శ్రీ
నారాయణపాదపద్మయుగళీచింతామృతాస్వాదనం। ధానండైమఱచున్నగా
రసుతుడేతద్విశ్వమున్భావరా॥ సీ॥ వైకుంఠచింతావివర్జితచేష్టుడైయొకచో
డునేడుచునొక్కచోట। నశ్రాంతహరిభావనారూఢచిత్తుడైయుద్ధతుడై పా
డునొకచోట। విష్ణుడింతియెకానివేఱొండులేద యొత్తిలినగుచు నొకచో
చోట।నలినాక్షుఁగనునిధానముఁగంటినేననియుబ్బిగంతులువైచునొక్కచోట
బలుకునొక్కచోటబరమేవగేధివు। ప్రణయహర్షజనితబాష్పసలిల। మిళితపు
లకుడైనమీలితనేత్రుడై। యొక్కచోటనగుచునురకుండు॥ వ॥ ఇట్లుపూర్వజ
న్మవరమభాగవతసంసర్గసమాగతంబైనముకుందచరణారవిందసేవాతిరేకం
బున నఖర్వనిర్వాణభావంబువిస్తరించుచునప్పటప్పటికిదుర్జనసంసర్గనిమి
త్తంబునందనచిత్తంబన్యాయత్తంబుగాకనిజాయత్తంబుసేయుచునప్రమత్తుం
డుమసంసారనివృత్తుండునుబుధజనవిధేయుండునుమహాభాగధేయుండును సు
గుణమణిగణ గరిష్ఠుండును పరమభాగవతశ్రేష్ఠుండును గర్మబంధలతాలవి
త్రుండను బవిత్రుండైనపుత్రునియందువిరోధించిసురవిరోధియను కంపలేక
చంపంబం పెననిపలికిననారదునకుధర్మజుండిట్లనియె॥ శా॥ పుత్రుల్నేరననేరకు
న్నజనకుల్పోషింతురెల్లప్పుడు। న్మిత్రత్వంబునబుద్ధిఁ జెప్పిదురితోన్మేషంబువా
రింతురే। శత్రుత్వంబు వలంబుపరిట్టియడనాసౌజన్యరత్నాకరుని। బుత్రున్శ్రీకవ
విత్రుడండ్రిమిగులవ్యాధింపనెట్లోర్చెనే॥ ఉ॥ బాలుంబ్రభావిశాలుహరిపాదప
యోరుహచి తనప్రియా। లోలుగృపాళుసాధుగుణశీలకపదానతభాలునిమ్మ

దుగాహ శాత్రవుడు దానవభర్తకు వీడు దైత్యచం| దనవ. మందుగంటకయుత
క్షితిజాత ముభంగిబుట్టిడా। దనపతితంబు రాక్షసకులాంతకు బ్రస్తుతిసేయుచుం
దుదం। దవమునగా. శిక్షలకు డాయమపట్టుకొట్టుమద్ధః॥ క॥ సీపాదనిజవి
వింతుము| పాదములాన ఇంకనిపుణతతోడం। గోపింతుము దండింతుము। కోపిం
పనుమయ్యా దనుజకు జరవింటే॥ వ॥ అనిమఱియునారాచపాఠనికివినిర్గోపాయ
మ్ములంబు గోపింతుండ వెరవు జూపుచు రాజసన్నిధిం బాపి తోడుకొనిపోయి యే
కాంతంబున॥ క॥ భార్గవనందనుడతడికి। మార్గము సెడకుండ బెక్కుమారు మని
చ్చు। వర్గత్రితయము జెప్పెన। నిర్గళమగుమతి విశేషముమరనరేంద్రా॥ వ॥ ఇతి
యుగురుడు శిష్యునకు సామదానభేదదండోపాయంబుల నెఱింగించి నిశికోవి
దుండ నయ్యెననినిశ్చయించి తల్లికి నెఱింగించి తల్లిజేత నలంకృతుండై నకులదీపకు
నవలోకించి॥ ఉ॥ త్రిప్పటిమన్న మామతమదీర్ఘములైనతివర్గపాఠము। ల్చప్పటి
మన్న నేడు మనదైత్యవరేణ్యుని మ్రోల నేమము। జెప్పిననీతిగారిము జెప్పటు
మన్నవిరోధిశాస్త్రము। ల్విప్పటిమన్న దుష్టమగు విష్ణుచరిత్రకథాగజాలముల్
వ॥ అ బుజ్జగించి దానవేశ్వరుని సన్నిధికిం దోడి తెచ్చిన॥ సీ॥ అంగద్గునకు నాద
వానుచింతనసుధామాధుర్యమున మెను మఱచువాని। నంభోజగర్భాదు లభ్య
సింపగలేని హరిభక్తి పుంభావమైనవాని। మాతృగర్భము సొచ్చియున్నది మొద
లుకొని చిత్తమచ్యుతుమీద జేర్చువాని। సంకించితెనలోని సఖిల ప్రపంచంబు శ్రీవి
ష్ణుమయమని తెలుగువాని। వినయకారుణ్యబుద్ధివివేకలక్షణాదిగుణములకా
టపట్టయినవాని। శిష్యబుధలోక సంభావ్యుజేటిగురువు। ముందటికి బ్రోచ్చి దండ్రి
కిబ్రాకు మనుచు॥ క॥ శిక్షించితిమన్యములగు। పక్షంబులుమాని నీతిపారగు
డయ్యె। బ్రత్యక్షం శాధీశ్వర। వీచింపుము సీకుమారు విద్యాబలము॥ వ॥ అనిపలి
కినశుక్రకుమారకు వచనంబులాకర్ణించి దానవేంద్రుండు దనకువందప్రణా
మంబుజేసి నిలుచున్న కొడుకును దీవించి బాహుదండంబులు సాచి దిగ్గునం డగ్గరం
దిగిచి గాఢాలింగనంబు సేసి తన తొడమీద నిడుకొని చుంబుడువ్వి చుబుకంబుపుని
కి చెక్కిలి ముద్దుగొని శిరంబు మూర్కొని ప్రేమాతిరేక సంజనితబాష్పబిందుసం
దోహంబుల నతని వదనారవిందంబు దడుపుచు మందమధురాలాపంబుల నిట్లని
యె॥ శా॥ చోద్యంబయ్యె మనింత కాలమరికిం బోధించి మేమేమి సం। వేద్యాం
శంబులు సెప్పిరో గురువులే వెంటపఠింపించిరో విద్యాసారము యింగ గోరెదభవద్వి
జ్ఞాతశాస్త్రంబులో । పద్యంబొక్కటి జెప్పి నార్థముగ దాత్పర్యంబు భాషింపు
మా॥ శా॥ నిన్నున్మెచ్చరు నీతిపారమహిమన్నీతోడిదైత్యార్భకుల్ గన్నారన్ని

యుజెప్ప నేర్చుటరుగ వా గ్రంథార్థములుబుత్తై। యన్నాయెన్నడు నీవు నీతి మాటి
వాదంబున్మహావాంఛతో। నున్నాడన్న నుగన్న తండ్రి భవదీయోత్కర్ష తజ్జావ
నే॥ వ॥ అనిన గన్నతండ్రికి బ్రియనందనుండైన ప్రహ్లాదుం డిట్లనియె॥ క॥ చదివిం
చిరి నను గురువులు। చదివితి ధర్మార్థముఖ్య శాస్త్రంబులు నే। జదివినవి గలవు పె
క్కులు। చదువులలో మర్మమెల్ల జదివితి తండ్రీ॥ మ॥ తనుహృద్భాషల సఖ్యము
శ్రవణ ముందాసత్వమున్వందనా। ర్చనముల్సేవయు నాత్మలో నెరుకయున్సం
కీర్తనల్చింతనం। బను నీ తొమ్మిది భక్తిమార్గముల సర్వాత్మున్ హరినమ్మిన। జ్జ
నుడై యుండుట భద్రమంచు దలతున్ సత్యంబు దైత్యోత్తమా॥ శా॥ ఆంధందూ
దయముల్మహాబధిరశంఖారావముల్మూకస। ద్గ్రంథాఖ్యాపనముల్నపుంసకవ
ధూకాంక్షల్కృతఘ్నావళీ। బంధుత్వంబులు భస్మహవ్యములు లుబ్ధద్రవ్యము
ల్క్రోధనా। ద్గంధంబుల్హరిభక్తివర్జితులురిక్తవ్యర్థసంసారముల్॥ సీ॥ కమలా
క్షునర్చించు కరములు కరములు। శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ। సురరక్షకుని
జూచు చూడ్కులు చూడ్కులు। శేషశాయికి మ్రొక్కు శిరము శిరము। విష్ణు నాక
ర్ణించు వీనులు వీనులు। మధువైరి దవిలిన మనము మనము। భగవంతు వలగొను
పదములు పదములు। పురుషోత్తముని మీది బుద్ధి బుద్ధి। దేవదేవుని జింతించు దినము
దినము। చక్రహస్తు బ్రకటించు చదువు చదువు। కుంభినీధవు జెప్పెడి గురుడు గురు
డు। తండ్రి హరి జేరుమనియెడి తండ్రి తండ్రి॥ సీ॥ కంజాక్షునకు గాని కాయంబు కా
యమే। పవన గుంఫిత చర్మభస్త్రి గాక। వైకుంఠు బొగడని వక్త్రంబు వక్త్రమే।
ఢమఢమధ్వనితోడి ఢక్క గాక। హరిపూజనము లేని హస్తంబు హస్తమే। తరుశా
ఖనిర్మిత దర్వి గాక। కమలేశు జూడని కన్నులు కన్నులే। తనుకుడ్యజాలరంధ్రము
లు గాక। చక్రిచింత లేని జన్మంబు జన్మమే। తరళసలిల బుద్బుదంబు గాక। విష్ణుభక్తి
లేని విబుధుండు విబుధుడే। పాదయుగము తోడి పశువు గాక॥ సీ॥ సంసార జీమూ
త సంఘంబు విచ్చునే। చక్రిదాస్యప్రభంజనము లేక। తాపత్రయాభీలదావాగ్ను
లాఱునే। విష్ణుసేవామృతవృష్టి లేక। సర్వంకషాఘౌఘ జలరాసు లింకునే। హరిమనీ
షా బడబాగ్ని లేక। ఘన విపదాంధకారంబు లడగునే। పద్మాక్షునుతిరవిప్రభ
లు లేక। నిరుపమాపునరావృత్తినిష్కళంక। ముక్తినిధి గానవచ్చునే ముక్త్యమైన
శార్ఙ్గకోదండచింతనాంజనము లేక। తామరసగర్భునకునైన దానవేంద్ర॥ వ॥
అని యివ్విధంబున వెరపు మఱపు నెఱుంగక తనయుండు జెప్పిన కొడుకు నుడువులు సె
వులకు ములుకుల యనోవిన గటములదర బెదవులు గఱచుచు నదరిపడి గురుసుతు
ని గనుంగొని నిమ్మతకథన బుద్ధి గఱపినాడవని దానవేశ్వరుండిట్లనియె॥ చ॥ వ

జుతరనీతిశాస్త్రచయ వారగు జేసెదనంచు బాలునిన్| వటుగోసిపోయి వాసికినన
త్యాముతైనవిరోధిశాస్త్రము| లుక్కుటిలత జెప్పినాడవు భృగుప్రవరుండ! టంచు
నమ్మితిం|గటకట బ్రాహ్మణాకృతివిగాక యథార్థవు బ్రాహ్మణుండవే॥ క॥ ధర్మే
తరవర్తనులును| దుర్మంత్రులు నైనజనుల దుఃతములొందు| న్మర్మములు కల
చికల్మష| కర్ములరోగములునొందుకై వడివిప్రా| అనిరాజునకుం బురోహితుం
డిట్లనియె॥ ఉ॥ తప్పులు లేవు మావలన దానవనాథవిరోధశాస్త్రముల్ సెప్ప
క్రూరులైన నరులు సెప్పరు మీచరణంబులాన సు| మ్మెప్పుడు నీకుమారకునికింత
యునైన మనీష యెవ్వరుం| జెప్పెడివాటిగాదు ప్రతిచి తదలంపు మునేర్పు నన్వ
డిగె॥ క॥ పుత్రులము పురోహితులము| పాత్రుల మే మదియుగాక భార్గవుముని
పుత్రుని నిటువలె జేయుద| శత్రుల మే దైత్యజలధిచంద్రమ వింటే॥ వ॥ అనినగు
రునందనుం గోపించక దైత్యవల్లభుండు కొడుకునవలోకించి యిట్లనియె॥ క॥ వా
జ్ఞలు సెప్పని యీమతి| మాజ్ఞాతుడవైన నీకు మతి యెవ్వని చే| నజ్ఞాతమయ్యె బాల
క| తజ్ఞులం జేరుగొను మతగనా మాళ్లకన్॥ వ॥ అనిన దండ్రికి బ్రహ్లాదుండిట్లని
యె॥ ఉ॥ అచ్చపు జీకటింబడి గృహవ్రతులై విషయప్రమత్తులై| చచ్చుచు బుట్టు
చున్నజలజర్విత చర్వణులైనవారికిం| జెచ్చెర బుట్టునే పరులు సెప్పిననైన నిజేచ్ఛ
నైననే| మచ్చిననైన గానలకు నేగిన నైన హరిప్రబోధముల్॥ ఉ॥ కాకనివాని
నూతగొని కానని వాడు విశేషవస్తువుల్| గానని భంగి గర్మములు గైకొని కొందరు
కర్మబద్ధులై| కానరు విష్ణు బొందరటగంతురకించన వైష్ణవాంఘ్రిసం| స్థానరజో
భిషిక్తులగు సంహృతకర్ము లదాన వేశ్వరా॥ శా॥ శోధింపం బడెనర్వశాస్త్రము
లురక్షోనాథ వెయ్యేటికిం| న్గాథల్మాధవశేముషీతరణసాంగత్యంబునంగాకదు|
శ్శ్రోధం దాటగవచ్చునే మనవధూమీనోగ్రవాఃఛామనక్రోధోల్లోల విశాలసం
సృతిమహా ఘోరామితాంభోనిధిన్॥ వ॥ అనిపలికిన కొడుకును దిక్కరించి మ
త్కృతసేయక రక్కసులరేడు తనతొడలపైనుండ నీక గొబ్బున దిగద్రొబ్బి నిబ్బ
రంబగు కోపంబు దీపింప వేడిచూపుల మింటమంట లెగయ మంత్రులం జూచి యిట్ల
నియె॥ శా॥ క్రోడంబై పినతండ్రి జంపెననితాగ్రోధించి చిత్తంబులో| వీడం జే
యడు బంటుభంగి హరికిన్ ద్వేషికిన్ భృత్యుడై| యోడండే కటకా! ప్రాణవాయువు
లువీడొప్పించుచున్నాడునా| తోడనైరము పట్టెనిట్టి జనకద్రోహిన్ మహిం
గంటిరే| అసురాతుసవీరులవీక్షించి యిట్లనియె॥

హిరణ్యకశిపుండు ప్రహ్లాదుని వధావివిధోపాయంబుల శిక్షించుట,

శా॥ పంచాబ్దంబుల వాడు తండ్రినగునా పక్షంబు నిందింపడు| కించిద్భ

గాని త్రిపురంబు లక్షింపకప్పినప్పుడు తద్బాణపావక హేతిసందోహ దందహ్య
మానులైన త్రిపురనివాసులం దెచ్చి మహాయోగియైన మయుండు సిద్ధరస
కూపకంబున వైచిన॥ క॥ సిద్ధామృతరసమహిమను। శుద్ధమహాబలితుల్యశోభిత
తనులై। వృద్ధిం బొందిరి దానవు। లుద్ధతనిర్ఘాతపావకోపములగుచున్॥ క॥ కూపా
మృతరససంగతి। దీపితులై నిలిచియున్న దేవాహితులన్। రూపించి చింతనొందె
డు। గోపధ్వజుడు చక్రికనాన్వితుడై॥ ఉ॥ ఉత్సాహంబున నాకకుత్పాడి ము
ద్వైయూథంబు ఘూర్ణించుచున్। వత్సంబై తన వెంట బ్రహ్మ నడవన్ వైకుంఠుం
డేతెంచియు। ద్వత్సత్వంబున గూపమధ్యరసముం దా త్రావె వ్వలోకించుచున్।
దత్సౌభాగ్యనిమగ్నులై మఱచిరా దైత్యవ్రజా వారివర్గన్॥ వ॥ ఇట్లు విష్ణుండు
మాహాగోకారంబున ధేనువై వచ్చి త్రిపురమధ్య కూపామృతరసంబు ద్రావిన
నెఱింగి శోకాకులచిత్తులై నరసకూపపాలకులం జూచి మహాయోగియైన మయుం
డు వేఱుగుపడి దైవగతిం జింతించి శోకింపక యిట్లనియె॥

గీ॥ అమరులైన దనుజులైన నరులైన। నెంతనిపుణులైన నెవ్వరైన
దైవికార్థ చయము దప్పింపగా లేదు। వలదు దనుజులార వగవ దనకు॥

వ॥ అని పలికె నంత విష్ణుండు నైజబులైన ధర్మజ్ఞాన విద్యా తపో విరక్తి స
మృద్ధి క్రియా శక్తి నిశేశంబుల శంభుతికి భ్రాంతిన్యాంబు సమర్పించి రథసూత
కేతు వర్మ వాహన ధాను బాణాసన ప్రముఖసంగ్రామ సాధనంబులు జేసి
నగైకొని॥ మ॥ శరియై కార్ముకియై మహావచియై సన్నాహియై వాహియై।
నరథుండై నియంతయైన సబలుడై సత్క్షేత్ర తచ్ఛృతుడై। పరమేశు డొక
చాలు మున్నిడి చెడిద దానానలజ్వాలలం। బురముల్గాలె జటచ్ఛటాగ్నినభో
భూమధ్యమున్ని డగన్॥ వ॥ ఇట్లు హరుండు మురవగాహంబులైన త్రిపురంబులన
భిజిన్ముహూర్తంబున భస్మంబు జేసి కూల్చిన నమరగరుడగ ధర్వసిద్ధ సాధ్య
యక్షవల్లభులు వీక్షించి జయజయ శబ్దంబులు సేయుచు గుసుమంబులు
గురిసిరి ప్రజలు హర్షించిరి బ్రహ్మగులు గీతించిరి యప్సరసలు వర్తించిరి
దివ్యకాహళ దుందుభిరవంబులును మంజుజోత్సవంబులు ప్రచురంబులయ్యె
నిట్లు విశ్వంజనంబగు త్రిపురాసుర సంహారంబున నఖిలలోకులు నంతసి
ల్లియుండనయ్యవసరంబున॥

గీ॥ తుహినకముక భంగి త్రిపురంబుల దహించి। పరము డవ్యయుండు భ
ద్రియశుడు। శివుడు వద్మజాగిచే గీయమానుడై। నిజనికేతనంబునకు నెమ్మి జ
నియె॥ వ॥ ఇట్లు నిజమాయావిశేషంబున మర్త్యలోకంబున విడంబించుచు

నారదుండు ధర్మరాజునకు వర్ణాశ్రమధర్మనిర్ణయం బుపదేశించుట.

ష్ణవిష్ణుని వర్ణాశ్రమవిధానంబులు మునిజనసంస్తూయమానంబులయి సకలలోక కల్యాణప్రధానంబులయి యుండు ననిన విని నారదుండు ధర్మనందనుండిట్లని యె॥ సీ॥ అనఘాత్మ సకలవర్ణాశ్రమాచార సమ్మతిధర్మమె వ్యాదిమాన వులకు। నేధర్మమునను దా దిద్ధవిజ్ఞానము భక్తియు బ్రాపించు బద్మజునకు। సా క్షాత్స్వ దవునకు నెఱుగరానిదిధర్మ మింతలేదు। నారాయణపరాయణ స్వాం తులనఘులు శాంతులు సదయులు నాధువృత్తి। కొందఱు చున్నఘనులుఱుమీవంటి వారెట్టి। పరధర్మనిచయభక్తిగలట్టి। రట్టిధర్మసంఘాత మనుఘలంబు నెరిగింపు। వినగనిష్పాలము విపులచరిత॥ వ॥ అనిన నారదుండు ధర్మరాజుం జూచి దా క్షాయణీదక్షుదునిజాంశంబుసజన్మించి భువనశోభనంబు కొఱకు బదరికాశ్ర మంబునం దపోనిరతుండయి యున్న నారాయణునివలన సనాతనధర్మంబు వింటి నది సెప్పెద సకలవర్ణంబులజనులకు సత్యంబును దయయు నుపవాసా దితపంబును శౌచంబును సైరణయు సదసద్వివేకంబు మనోనియంబును బరిహింద్రియ జయంబును బహిరింద్రియ జయంబును హింసలేమియు బ్రం హ్మచర్యంబును దానంబును యథోచితజపంబును సంతోషంబును మార్ద వంబును సమదర్శనంబును మహాజన సేవయు గ్రామ్యంబులయిన కోరికలు మానుటయు నిష్ఫలక్రియలు విడుచుటయు మమ్మితభాషిత్వంబును దేహంబు గాని తన్ను వెదకి కొనుటయు నన్నోదకంబులు ప్రాణులకుం బంచియిచ్చుట యు బ్రాణులందు దేవతాబుద్ధియు నాత్మబుద్ధిం జేయుటయు శ్రీనారాయ ణచరణ స్మరణ కీర్తన శ్రవణ సేవార్చన నమస్కారదాస్యాత్మసమర్ప ణ సఖ్యంబులనియెడి త్రింశల్లక్షణంబులు గలుగవలయు నందు సత్కులా చారుండయి విధిగోచరంబులయిన గర్భాదానాది సంస్కారంబుల విచ్ఛి న్నంబులుగా గలవాడు ద్విజుండు ద్విజునకు యజనయాజనాధ్యయనాధ్యా పనదాన ప్రతిగ్రహంబులను షట్కర్మంబులు విహితంబులు రాజునకు బ్ర తిగ్రహవ్యతిరిక్తంబులయిన యజనాది కర్మంబులందును బ్రజాపాలన మ్మును బ్రాహ్మణులుగాని వారివలన దండశుల్కాదులు గొనుటయు విహి తకర్మంబులు వైశ్యునికి కృషివాణిజ్య గోరక్షణాది కర్మంబులు బ్రా హ్మణ కులానుసరణంబును విహితంబులు శూద్రునకు ద్విజశుశ్రూష సేవావ లయు॥ సీ॥ వినుకర్షణాదిక వృత్తిం జెనఁ మేలు యాచింపనొల్ల. యట్టిన్వృ త్తి। పాత్రంబుగయికొని బ్రతుకకుండుట లెస్స యనుదినంబు ధాన్య పడి

గికొనుట। యాయావరమునకంటె నధికకళ్యాణంబు వరిగడియనున్నలబ్ధాన్నభ
క్షణంబు। శిలజీవనముకంటె శ్రేయస్సాధనముల బద్ధగింజలుదిని బ్రతుకు
ట। యడుగకచొటన్నృపతికినాల్గువృత్తులు। దగుబ్రతిగ్రహంబుదలపదగదు।
నాపదవసరముల నధముడైనక్షత్రజాతి। వృత్తినున్నదోష విధముగాదు॥ వ॥
వినుము శిలవృత్తియు నుంఛవృత్తియు బుతమనియు నయాచితవృత్తి యు
మృతమనియు యాచ్ఞావృత్తి మృతమనియు గర్షకవృత్తి ప్రమృతమని
యు నెన్నఁదు రట్టివృత్తుల జీవించుట మేలు శ్వవృత్తి నీచసేవయనిపలుకఁదగు
సర్వవేదమయుఁడు బ్రాహ్మణుండు సర్వదేవమయుండు క్షత్రియుండు బ్రా
హ్మణక్షత్రియులకు నీచసేవనంబు గర్తవ్యంబుగాదు॥ క॥ దమమును శౌచ
మునపమును। శమమును నార్జవము గృపయునత్యజ్ఞాన। క్షమయును హరి
భక్తియును। సమమునిజలక్షణము లగ్రజాతికి నధిపా॥ ఉ॥ శౌర్యము దానశీల
ము బ్రసాదమునాత్మ జయంబు దేజమున్। ధైర్యము దేవభక్తియును ధ
ర్మమునర్థము గామమున్ బుధా। చార్యమనోజ్ఞసేవలును సత్కృతియుం
బరితోషణంబున। ధైర్యమురక్షణంబుబృథివీశ్వర శేఖర రాజచిహ్నముల్॥
క॥ ధర్మార్థకామవాంఛయు। నిర్మలగురుదేవవిప్రనివహార్చనము। న్మర్మ
గభావము ప్రమదము। కర్మకరత్వంబులు వైశ్యజనలక్షణముల్॥ ఉ॥ స్తే
యము లేనివృత్తియును చిత్యము సన్నతియున్ని జేశుల। న్మాయలులేకడాయు
టయు మంత్రముజెప్పక పంచయజ్ఞముల్। సేయుటయుర్వరామరుల సేవ
యుంగోవుల రక్షణంబున। న్యాయము లేమియున్ మనుజ నాథజంబుంగుగును
శూద్రధర్మముల్॥ సీ॥ నిలయముపాటించి నిర్మలదేహయై శృంగారము
ప్రొద్దు జేయవలయు। సత్యప్రియాలాపచతురయై ప్రాణేశు చిత్తంబు ప్రేమ
రంజింపవలయు। దాక్షిణ్యసంతోషధర్మమేధాసుల దయితునిప్రియుద
లపవలయు। నాథు డేపద్ధతి నడచునా పద్ధతి నడచిసద్బంధుల నడుపవలయు।
మార్దవమునబతికినుచ్ఛిష్టభోజన। శయనపాదరతుల జరుపవలయు। విశ్రుతుప
తితుడయిన వెలదిపాతివ్రత్య। మహిమ బయలుసేసి మనుపవలయు॥ క॥ తరుణి
లేనప్రాణవల్లభు। హరిభావముగా భజించి యతనితోడన్। సిరికయివడి
నలరించును। హరిలోకమునందు సతత నానందమునన్॥ క॥ ఉపవాసంబులు
వ్రతములు। దపములు వెయ్యేల భర్త దయితమానిస। చపలత గొల్చిన
సాధ్వికి। నుపవరమార్గము లేదు నిఖిలజగములన్॥ వ॥ మఱియు సంకర
జాతులయిన రజకచర్మకారకనట బురుడకైవర్తక మ్లేచ్ఛభిల్లురగు నం

త్రాతు లేఖ్వరకుజంబాల వృత్తులన మాతంగజాతులకును నాయాకులాగతం
బులయిన వృత్తులు చౌర్యహింసాదులు వర్జించి సంచరింపవలయు మానవుల
కు బ్రతియుగంబునయిన సర్గక్రమంబులయిన ధర్మంబులు రెండు లోకంబులం
దుసుఖకరంబుల నివేదవిదులయిన పెద్దలు సెప్పుదురు కారుకారున దున్నదు
క్షేత్రంబు లాఁవు చెడునందు జల్లినబీజంబులు నిస్తేజంబులయియుండి లెస్సగ
వంకురింపవు నిరంతరఘృత ధారావర్షణంబున దహనంబునకు దాహకత్వం
బు లేక శాంతిం జెందునందు వ్రేల్చినహవ్యంబులు ఫలింపవు తద్విధంబున నన
రత కామానుసంధానంబున గామోపభోగంబయిన చిత్తంబు కామంబుల
దనిసి నిష్కామంబై విరక్తిఁ బొందుఁగావున సత్త్వస్వభావంబుతోడ నెప్పుడు
దప్పక నిజవంశానుగతవిహితధర్మంబున వర్తించునరుండు మెల్లన స్వాభా
వికకర్మపరత్వంబు విడిచి ముక్తిఁ బొందు జాతిమాత్రంబునఁ బురుషునివర్ణం
బు నిర్దేశింపలేదు శమదమాదివర్ణలక్షణ వ్యవహారంబుల గనవలయునని
నారదుం డిట్లనియె॥ క॥ క్రమమున వర్ణంబుల చిహ్నము లెల్లను జెప్పఁబడి
యెను నాశ్రమముల । ధర్మము లెఱిగించెద నన్నియు । సమదాహితప్రాంద్దయ
శీలనవమశీలా॥ వ॥ వినుము బ్రహ్మచారి యగువాఁడు కౌపీన యజ్ఞోపవీతకృష్ణా
జినపాలాశదండక మండలుధరుండును సంస్కారరహిత శిరోరుహుండును ద
ర్భహస్తుండును శౌచప్రశస్తుండును మౌనియునయి త్రిసంధ్యంబుల బ్రహ్మగాయ
త్రిజపియింపుచు సాయంప్రాతరవసరంబుల నర్కపావకగురుదేవతోపాసనం
బులు సేయుచు గురుమందిరంబునకుం జని దానుని చందంబున భక్తివినయసౌ
మనస్యంబులుగలిగి వేదంబులు సదువుచు నధ్యయనోపక్రమావసానంబుల
గురుచరణంబులకు నమస్కరించుచు రేపుమాపును విహితగృహంబుల భిక్షి
ంచి భైక్షంబు గురువునకు నివేదించి యనుజ్ఞ గొని మితభోజనంబుఁ గావించుచు వి
హితకాలంబున నుపసించుచు సంగనయుండు సంగవాసక్తులందుం బ్రయోజ
నమాత్ర భాషణంబులొనరించుచు గురుపరాంగనలవలన నభ్యంగన కేశప్ర
సాధన శరీరమర్దనమజ్జనరహస్య యోగంబులు వర్జించుచు గ్రుహంబున
నుండక జితేంద్రియత్వంబున సత్యభాషణుండయి సంచరింపవలయు॥ గీ॥ పొ
లతి దావవహ్ని పురుషుఁ డాజ్యఘటంబు । గాఁగ కుండ రాదంగ దిసెనే । బ్రహ్మచారి
యినఁ గూఁతు బట్టకమానవు। వటుసకింతిపొత్తు వలదు వలదు॥ వ॥ వినుము స్వ
రూప సాక్షాత్కారంబున దేహ బహిరింద్రియాదికంబయిన యంతయు నా
భాస మాత్రంబుగా నిశ్చయించి యొండొక జీవుండు స్వతంత్రుండయి నయినా

శ్వరుండుగాక తనంతదజేపురంగనయిది పురుషుండు నేనని యెడి బుద్ధిగా
నుట కర్తవ్యంబు బ్రహ్మచారి యతియు గృహస్థులం దెవ్వఁడైన విజితంబుప
పక్వంబుగాక నద్వైతానుసంధానంబు సేసిన మూఢుఁడగుంగావున నిరహస్యం
బున బుద్ధికనైన దాయకుండవలయు॥ చ॥ శిరమున మీసనంస్కృతులు సేయక
చ దనభూషణాద్యలంకరణము లెల్లమానియుతు కాలములన్ని జభార్యఁ బొందు
చుం దరుణులఁ జూడ కాలికదృఢవ్రతుఁడై మధుమాంసవర్జియై గురుతరవృ
త్తితోఁ మెలఁగుకోవదుడొక్క గృహస్థుభూవరా॥ వ॥ మఱియు ద్విజుండు గృహ
స్థుడై గురువులవలన నుపనిషదంగసహితంబు న నేదమంత్రంబును బఠియించి
నిజాధికారానుసారంబు నసర్థవిచారంబు జేసి తనబలంబు కొలంది గురువులకును
యభీష్టంబు లొసంగి గృహంబు నొండె నైష్ఠికత్వంబు నాశ్రయించి ప్రాణులతోఁడ
జీవించుచు గురువునందు నగ్నియందు నాత్మయందు సర్వభూతంబులందు నచ్యుత
తదర్శనంబు జేయుచు నింద్రియంబుల నాదినగ్నుండుగాక యెఱుకగలిగి వర్తిం
చుచు పరబ్రహ్మంబు నొందు॥ క॥ వినుము వానప్రస్థుఁడు। మునిశోధితములైన
యమములుగలవాఁడు। వ్రనవగతుఁడై మెలఁగును। ఘనుఁడు మహాలోకమున
కుగమనించి గ్రుప్పా। వ॥ అటమీఁద గృహస్థాశ్రమంబు విడిచి వనమునకుం జనియున్న
కపంబెనుని వారాదికంబు లగ్నిపక్వంబు చేసియుండెనావు బుచేసి యుండె
ర్కపక్వంబున ఫలైలాదు లొండె నశ్నించుచు వన్యాహారంబులు నిత్యకృత్యంబు
లయిన చరుపురోడాశంబు లొనర్చు ప్రతిదినంబు నంబునార్చనంచితంబులు పరి
త్యజించి నూతన ద్రవ్యంబులు సంగ్రహించుచు నగ్నికొఱకు బర్ణశాలయైన
బర్వతకందరంబయిన నాశ్రయించుచు హిమవాయువహ్ని వర్షాతపంబుల సహి
హించుచు నఖశ్మశ్రుకేశతనూరుహంబులు పరిసాధితంబులు సేయక జటిలుం
డై యుపసియించుచు దండాజినకమండలు వల్కలపరిచ్ఛదంబులు ధరి
యించి పండ్రెడుమన వెనిమిదయిన నాలుగైన రెండయిన నొకవత్సరంబ
యున తపఃప్రయాసంబున బుద్ధినాశంబు గాకుండ మునియై యుచరించుచు మద
యువపశంబున జరారోగంబులచేత జిక్కి నిజధర్మానుష్ఠానసమర్థుండు
గాని సమయంబున నిరశనవ్రతుండై యగ్నుల నాత్మారోపణంబు సేసిస
న్న్యసించి యాకాశంబు నందు శరీరరంధ్రంబులు గాలియందు నిశ్వాసంబును
దేహంబులోపల సూత్రంబును జల్యంబుల రసంబును ధరణియందు శల్యమాంస
ప్రముఖంబులు వహ్నియందు వక్త్రంబుతోడ వాక్కు నింద్రుని యందు శి
ల్పంబుతోడ హస్తంబు విష్ణువునందు గతితోడ బదంబు ప్రజాపతియం

ఛ. తితోడను పస్థంబును మృత్యువునందు విసర్గంబుతోడ వాయువును దిక్కులందు శబ్దంబుతోడ శ్రోత్రంబును వాయువునందు స్పర్శంబుతోడ త్వక్కును సూర్యునియందు రూపంబుతోడ జక్షువులును సలిలంబులందుఁ బ్రచేతస్సహితయయిన జిహ్వయు క్షితియందు గంధసహితంబయిన ఘ్రాణంబును జంద్రునియందు మనోరథంబులతోడ మనంబును కవియయిన బ్రహ్మయందు బోధంబుతోడ బుద్ధియు రుద్రుని యందహంకారంబు తోడ మమత్వంబును క్షేత్రజ్ఞునియందు సత్త్వంబుతోడ జిత్తంబును జేర్చి యట మీఁద బృథివి నుందుబృథివిని జలంబునందు జలంబును తేజంబునందు తేజంబును వాయువందు వాయువును గగనమందు గగనము నహంకారతత్త్వమందున హంకారమును మహత్తత్త్వమునందు మహత్తత్త్వమును బ్రకృతియందు బ్రకృతిని అక్షరుండయిన పరమాత్మయందును లయంబునొందించి చిన్మాత్రావశేషితుండయిన క్షేత్రజ్ఞుండగు తన్ను నక్షరత్వంబున నెఱింగి ద్వయరహితుండై దగ్ధకాష్ఠుండగు నవహ్నిచందంబున బరమాత్మయైన నిర్వికారపరబ్రహ్మంబునందు లీనుండగావలయు॥ క॥ అనఘ వనప్రస్థుండయి। చనఁ దథధర్మంబు లిట్లు స లుపుచు మతియు। న్మనెనేని సన్న్యసింపం। జనునటమీఁద ముక్తిసంగత్వము నన్॥ వ॥ ఇట్లు వానప్రస్థాశ్రమంబు జరిపి సన్న్యసించి దేహమాత్రావశిష్టుండును నిరపేక్షుండును భిక్షుండును నిరాశ్రయుండును నాత్మారాముండును సకలభూతసముండును శాంతుండును సమచిత్తుండును నారాయణపరాయణుండునై కౌపీనంబును నాచ్ఛాదనమాత్రంబైన వస్త్రంబు ధరియించి దండాదివ్యతిరిక్తంబులు విసర్జించి యాత్మపరంబులుగాని శాస్త్రంబుల వర్జించి గ్రహనక్షత్రాది విద్యలజీవింపక భేదవాదంబైన తర్కంబులతరి ం పక నొందును బక్షీకరింపక శిష్యులకు గ్రంథంబులు వచించి యుపన్యసింపక బహువిద్యలజీవింపక మత్తాది వ్యాపారంబుల నుల్లసిల్లక పెక్కుదినంబు లొక్క చో డవసియింపక యూరనూర నొక్కొక్క రాత్రి నిలుచుచు గార్యకారణ వ్యతిరిక్తంబై పరమాత్మయందు విశ్వంబు దర్శించుచు సదసన్మయంబైన విశ్వంబునందు పరబ్రహ్మంబైన యాత్మ నవలోకించుచు జాగరణస్వప్నసంధిసమయంబుల నాత్మనిరీక్షణంబు సేయుచు నాత్మకు బంధమోక్షంబులు మాయామాత్రంబులు గాని వస్తుప్రకారంబున లేవనియును దేహంబునకు జీవితంబు ధ్రువంబు గాదనియును మృత్యువు ధ్రువంబని యెఱుంగుచు భూతదేహంబుల భవనాశంబులకు మూలంబైన కాలంబు బ్రతీక్షించుచు నిర్విఘ్నము సజ్జానోత్ప త్తి

కృసమయంబున దిగంబరుండనయి పిశాచంబు చందంబున నుండుచుం జెక్కి
దినంబులుం గొలఁదెనుపాము వలెఁ నంబగయికొని నిమిలితలోచనత్వంబున
నేకాంతభావంబున విష్ణుని యందుఁ జేర్చి భేద గ్రహితచిత్తవృత్తులనర్థరూపపరి
భ్రమంబుగల మనమునందు మనంబు నహంకారంబునందు నహంకారంబు
మాయయందు మాయ నాత్మానుభూతి యందు లయంబు నొందించి సత్యంబు ద
ర్శించుచు విరక్తి నొంది స్వానుభవంబున నాత్మస్థితుండ నయియుండుదు నీవు భ
గవత్పరుండవు గావున రహస్యంబయిన పరమహంసధర్మంబు స్వానుభవగో
చరంబయిన తెఱంగున నీకు హృద్గోచరంబగునట్లు చెప్పితి ననిన విని॥ క॥ ఘన
నజగరమునివల్లభుని దనుజేంద్రుడు పూజ చేసి తగ వీడ్కొని నా । జనియె న్నిజచే
హామునకని శశికులతిలకా॥ అనియుధిష్ఠిరుండిట్లనియె । క॥ నను బోటి జడ
గృహస్థుడు । మునివల్లభ యిట్టి పవిమోదంబున నే । యనువున జెందును వేడ
మ । వినిపింపుము నేడు నాకు విజ్ఞాననిధీ ॥ వ॥ అనిన నారదుండిట్లనియె గృహ
స్థుడయినవాడు వాసుదేవార్పణంబుగా గృహోచితక్రియలను సంధించుచు
మహామునుల సేవించి వారలవలన నారాయణదివ్యావతారకథాశ్రవణంబు
సేయుచు నయ్యవహిత కాలంబులఁ శాంతజనులం గూడియుండుచు బుత్రమి
త్రకళత్రాదిసంగంబులు గలల వంటివని యెఱుంగుచు బోవలనాసక్తి లేక సక్త
నికయివడి వెలువబడుచు కారంబులొనర్చుచు దగులంబులులేక విత్తంబులి
చ్చి జనకసుతసోదర సఖిజ్ఞాతిజనులచిత్తంబులు గావించుచు ధనధాన్యనిదాన
మయిన లబ్ధంబులవలన నభిమానంబు మాని యనుభవించుచు గృహక్షేత్రంబు
లఁ జొచ్చి యుదరపూరణమాత్రంబు దాం గిలిన వాని దండింపక భుజగమృగ
మూషకమర్కట మక్షికాఖరోష్ట్రంబుల హింసింపక పుత్రుల భంగి నీక్షిం
చుచు దేశకాలదయివంబులకొలంది నిత్యధర్మార్థకామంబుల బ్రవర్తించు
చు శునక పతిత చండాలాదులకయిన భోజ్యపదార్థములు తన భంగినిచ్చుచు నిజ
వృత్తిలబ్ధంబులగు సకనాదులచేత దేవ ఋషి పితృ భూత మానవుల సంతర్పిం
చుచు బలిచ మహాజ్ఞాన శేషంబుల నంతర్యామి పురుషయజనంబు నాత్మజీవనో
పాయంబును సమర్థించుచుండవలయు॥ గీ॥ జనగురుల నయిన జంపు నర్థ
మునపయి । ప్రాణమయిన విడుచు భార్యకొఱకు । నట్టి భార్య పురుషుండతిథుల
శుశ్రూష చేయించెనటుచు నజితు నీశునయిన ॥ గీ॥ పరమేశ్వరుండు బ్రాహ్మ
ణముఖమున । నాహరించు తుష్టుడయిన భంగి నగ్నిముఖము । నందు హవ్యరా
సులుగొని । యయినదుష్టి నొందదనఘచరిత॥ వ॥ కావున గృహస్థుండు బ్రా

హ్మణులయందును, దేవతాలయందును, మఱియుఁ బ్రముఖవస్తుజాతులందును, సంత ర్పణీయులగు బ్రాహ్మణాననుండైన క్షేత్రజ్ఞునందు నయిన కోరికలు సమర్పిం చి సంతర్పణంబు జేయవలయు భాద్రపదంబున కృష్ణపక్షంబునందు దక్షిణో త్తరాయణంబులందును, రేయుం బగలు సమము నగు కాలంబులందును, వ్యతీ పాతంబులందును, దినక్షయంబులందును, సూర్యచంద్రగ్రహణంబులం దును, శ్రవణద్వాదశియందును, వైశాఖశుక్లతృతీయయందును, కా ర్తీక శుక్లనవమియందును, హేమంతశిశిరంబులలోని నాలుగష్టకలందును, మాఘశుక్లసప్తమియందును, మాఘనక్షత్రంబులతోడఁ గూడిన పున్నమలందు ను, ద్వాదశితోడం గూడిన యుత్తరా శ్రవణానూరాధలందును, ను త్త రాయసహితులయిన యేకాదశీతిథులయందును జన్మనక్షత్రయుక్తదివసం బులందును, మఱియుఁ బ్రశస్తకాలంబులయందును, జననీజనకబంధుజనులకు శ్రాద్ధంబులును, జపహోమస్నానవ్రతంబులును, దేవబ్రాహ్మణసమారా ధనంబులు నాచరింపవలయు, భార్యకుఁ బుంసవనాదికంబు సత్యంబునకు జా తకర్మాదికంబును దనకు యజ్ఞదీక్షాదికంబును, ప్రేతజనులకు దహనాది కంబును మృతదివసంబున సాంవత్సరికంబును జరుపవలయు॥ మ॥ విను మేదే శములందు మాగుణతపోవిద్యాన్వితంబయినవి। ప్రసిద్ధాయంబు వసించు నేస్థల ముల భాగీరథీముఖ్యవా। తులుండుఁ హరిపూజలెయ్యెడల భూమిస్థప్ర కాశంబులం। దనరున్ భవ్యయిట్టిచోటులఁ గుశలకర్మంబులఁ జేయగా॥ క॥ హరియందు జగములుండును। హరిరూపము సాధుపాత్రమందుండు శివం। కరమగు పాత్రము గలిగిన। నరయగ దివ్యదేశమనఘచరిత్రా॥ వ॥ మఱి యు నగు క్షేత్రంబును, గయాశీర్షంబును, ప్రయాగంబును. పులహాశ్రమం బును, నైమిశంబును, ఫాల్గునంబును- సేతువును - ప్రభాసంబును కుశస్థ లియును- వారాణసియు - మధురాపురియును - పంపాబిందు సరోవరంబు లును- నారాయణాశ్రమంబును- సీతారామాశ్రమంబును- మహేంద్ర మ లయాదులయిన కులాచలంబులును హరిప్రతిమార్చనా ప్రదేశంబులును హ రిసేవాపరమ భాగవతులు వసించు పుణ్యక్షేత్రంబును - శుభకా [illegible] మాకు సేవింపవలయు॥ గీ॥ భూవరేంద్ర యట్టి పుణ్యక్షేత్రదేశంబు [illegible] ము సేయునట్టి ధర్మ। మల్పమైన నదిసహస్రగుణాధి। కఫలమిచ్చు [illegible] పావశమున॥ వ॥ విను మచరాచరంబైన విశ్వమంతయు విష్ణుమయంబగుటం జేసి పాత్ర నిర్ణయనిపుణులైన విద్వాంసులు నారాయణుండె [illegible]

బని పలుకుదురు. దేవ ఋషులును బ్రహ్మపుత్రులగు సనకాదులునుండ భవ
దీయ రాజసూయంబున నగ్రపూజకు హరి సమ్మతుండయ్యె. ననేకజంతుసం
ఘాతసంకీర్ణంబైన బ్రహ్మాండపాదపంబునకు నారాయణుండు మూలంబు త
న్నిమిత్తంబున నారాయణసంతర్పణంబు సకలజనసంతర్పణంబని యెఱుంగు
ము. ఋషి నర తిర్యగమర శరీరంబులు పురంబులు వానియందు దారతమ్యంబు
లతోడ జీవరూపంబున భగవంతుండైన హరి వర్తించుటం జేసి పురుషుండన బ్ర
సిద్ధుండయ్యె. నందు దిర్యగ్జంతువులకంటె నధికత్వంబు పురుషునియందు విలసి
ల్లుటం జేసి పురుషుండు పాత్రంబు. పురుషులలోన హరితనువైన వేదంబు ధ
రించు సంతోషవిద్యా తపోగరిష్ఠుండైన బ్రాహ్మణుండు పాత్రంబు. బ్రాహ్మ
ణులలోన నాత్మజ్ఞాన పరిపూర్ణుండైన యోగి ముఖ్యపాత్రంబని పలుకు
దురు. పరస్పర పాత్రభావంబులకు సహింపని మనుష్యులకు పూజనార్థంబు త్రేతాయు
గంబునందు హరిప్రతిమలు గల్పింపబడియెఁ గొందఱు ప్రతిమార్చనంబుఁ
జేయుదురు. పురుషశ్రేష్ఠులయిన వారలకు ప్రతిమార్చనంబు ముఖ్యా
ర్థప్రదంబు గాదు. మందాధికారులకు బ్రతిమార్చనంబ పురుషార్థప్రదం
బగు. ॥ గీ॥ అఖిలలోకములకు హరి దైవతము సూడ । హరికి దైవతము ధరాధి
నాథ। పదపరాగ లేశపంక్తి చే త్రైలోక్య। పావనంబు జేయు బ్రాహ్మణుండు॥ వ
ట్టి బ్రాహ్మణజనులందు గర్మనిష్ఠులు తపోనిష్ఠులు వేదశాస్త్రనిష్ఠులు జ్ఞానయో
గనిష్ఠులు నై కొందఱు వర్తింతురందు జ్ఞాననిష్ఠునికి సనంతఫలకామి నియైన గృహ
స్థు పితృజనుల నుద్దేశించి కవ్యంబులును దేవతల నుద్దేశించి హవ్యంబులును బె
ట్టుట ముఖ్యంబు. దైవకార్యంబునకు నిరువురనైన నొకరినైన సరి। పితృకార్యంబుని
కు మువ్వురినైన నొకరినైన భోజనంబు సేయింపవలయు ధనవంతుండైన శ్రాద్ధవి
స్తారంబు గర్తవ్యంబు గాదు. దేశకాలప్రాప్త కందమూలఫలాదికంబైన
హరినైవేద్యంబున విధిచోదిత ప్రకారంబ గా శ్రద్ధతోడం బాత్రంబునందు బె
ట్టిన యన్నంబు కామదంబయి యక్షయఫలకారియగు. ధర్మతత్త్వవేదియైన వాడు
శ్రాద్ధంబులందు మాంసప్రదానంబు జేయక భక్షింపక చరింపవలయు. గంద మూ
లాది దానంబున నయ్యెడి ఫలంబు పశుహింసనంబున సంభవింపదు. ప్రాణిహిం
స జేయక వర్తించుటకంటె మిక్కిలి ధర్మంబు లేదు. యజ్ఞవిదులైన ప్రోడలు
నిష్కాములై బాహ్యకర్మంబులు విడచి యాత్మజ్ఞానదీపంబులందు గర్మా
మయంబులైన యజ్ఞంబుల నాచరింతురు ॥ క ॥ పశువుల బొరిగొని మఖ
ములు। విశదములుగ జేయు బుధుల వీక్షించి తమున్। విశసనము జేయు

నోయుసి। కసిమసిబౌగడొందు భూత గణమున నరేంద్రా ॥ వ ॥ అదిగావున
ధర్మవేదియైన వాడు దైవప్రాప్తంబు లయిన కందమూలాదికంబులచేత
నిత్యనైమిత్తిక క్రియలజేయవలయు నిజధర్మబాధకంబైన ధర్మంబును బరధర్మ
ప్రేరితంబైన ధర్మంబు నాభాసధర్మంబును బాషండధర్మంబు కపటధర్మం
బును ధర్మజ్ఞుండైనవాడు మానవలయు నైసర్గికధర్మంబు దురితశాంతిస మ
ర్థంబగు నిర్ధనుండు ధర్మార్థంబు యాత్ర జేయుచునైన ధనంబు గోర వలదు జీ
వనోపాయంబునకై నిట్టట్టు దిరుగక గార్హస్థ్యంబు లేకజీవించుచు మహాస
ర్పంబు తెఱంగున సంతోషంబున నాత్మారాముండయి యుండియు. గోరక బ్ర
తికెడి సుగుణుని కగల సుఖంబు కామలోభంబు లందశదిశలం బఱిధావనం
బుజేయువానికి సిద్ధింపదు పాదరక్షలు గలవానికిం గర్కశ కంటకాదులవ
లన భయంబు లేకమెలంగు భంగి గామంబుల వలననివృత్తి గలవానికి నె
ల్లకాలంబును భద్రంబగును జిహ్వాదయిన్యంబునకును బుభుక్షుండు గృహపా
లకశునకంబుకయివడి సంచరించుచు సంతుష్టిలేకచెడు నసంతోషి గానివిప్రునికి
విద్యాతపోవిభవయశంబులు నిరర్థకంబులగు నింద్రియలోలత్వంబున విజ్ఞా
నంబునశించు సకలభూలోక భోగంబులు భోగించియు దిగ్విజయంబు జేసి
యుంబుభుక్షాపిపాసలవలన గామపారంబు చు హింసవలన గామపారంబు
ను హింసవలన క్రోధపారంబును జేరటదుర్లభంబు సంకల్పవర్జనంబున
గామంబును గామవర్జనంబున క్రోధంబును నర్థానర్థదర్శనంబున లో
భంబును ద్వయితానుసంధానంబున భయంబు నాత్మానాత్మవివేకంబుల శోక
మోహంబులును సాత్త్వికసేవనంబున దంభంబును మౌనంబున యోగాంతరా
యంబును శరీరవాంఛ లేమి హింసయు హితాచరణంబున భూతజయంబయిన
దుఃఖంబును సమాధిబలంబున దయివికవ్యథయును ప్రాణాయామాదికంబున
నాత్మవ్యథయును సాత్త్వికాహారంబుల నిద్రయు సత్త్వగుణంబున రజస్తమం
బులును గురుభజనకుశలుండయి శీలంబున జయింపవలయు॥ క॥ హరిమహిమత
లకు జెప్పెడి। గురువు నరుడనుచు దలచి కుమతిలభక్తికా। దిరుగు పురుషు శ్రమ
మెల్లను। గరిశౌచము క్రియ నిరర్థకంబగు నధిపా॥ ఉ॥ యోవనజాతనేత్రుండు పర మే
శుమహాత్ముప్రధానపూరుషుం। డేవశరణ్యుసజ్జన ధ్యేయుడనంతుడు బ్రహ్మయో
గిసంసేవిత పాదపద్ము దమచిత్తములన్నరుడంచు లోకులి। చ్ఛాదనవిహారముచుం
దుదురు సన్మతి లేకన రేంద్రమా॥ వ॥ వినుము షడింద్రియంబుల [illegible]
యంబు దత్పరులయిచ్ఛాపూరణ విధానంబుల జరితార్థులమైతిమను వార

విషయ శత్రుమధ్యంబునం గూల్చిన॥ గీ॥ విషయశత్రులెల్ల విక్రాంతితోడ సా।
రథిసమేతుఁడైన రథికుఁ బట్టి। యుగ్రగతి రమ్యత్వాయు తమకునంతా। కూపమ
ధ్యమందుఁ గూల్తు రధిప॥

వ॥ విను వైదికకర్మంబు ప్రవృత్తంబును నివృత్తంబును రెండు తెఱంగుల వెలయు
నందుఁ బ్రవృత్తంబున రావర్తనంబును నివృత్తంబున మోక్షంబును సిద్ధించుఁ బ్ర
వృత్తికర్మంబులైన నిష్టాపూర్తంబులన రెండుమార్గంబులు గలవందు హిం
సాద్రవ్యమయ కామ్యరూపంబులైన దర్శపూర్ణమాస పశుయాగ వైశ్వదేవ
బలిహరణ ప్రముఖంబు లయిన యాగాదికంబు లిష్టంబులు దేవతాలయ వనకూ
ప తటాక ప్రముఖంబులు పూర్తంబులు ప్రవృత్తికర్మంబున దేహంబు విడిచి
దేహాంతరారంభంబున దేహి హవ్యాదియాగ్రంబున వెలుంగువానితోడ నింద్రి
యంబులం గూడి భూతసూక్ష్మయుక్తుండై ధూమ క్షీణాయన కృష్ణపక్ష
రాత్రిదర్శనంబులవలన సోమలోకంబుఁ జేరి భోగావసానంబున విలీనదేహుం
డయి వృష్టిద్వారంబున క్రమంబున నోషధిలతాన్నశుక్లరూపంబులఁ బ్రాపించి
భూమియందు జన్మించు నది పునర్భవరూపంబయిన పితృమార్గంబు నివృత్తి
కర్మనిష్ఠుండైనవాఁడు జ్ఞానదీపంబులైన యింద్రియంబులందుం గ్రియాయజ్ఞం
బుల యాజించి యింద్రియంబుల దర్శనాదిసంకల్పరూపంబయిన మనంబునం
బునందు వికారయుక్తంబయిన మనంబును వాక్కునందు విద్యాదిలక్షణయై
న వాక్కు నవర్ణసముదాయంబునందు నవర్ణసముదాయంబును కారాదే
స్వరత్రయాత్మకంబయిన యోంకారంబునందు నోంకారంబును బిందువందు
బిందువును నాదంబునందు నాదంబును బ్రాణంబునందు బ్రాణంబు బ్రహ్మ
మందు నిలుపవలయు దేవమార్గంబులయిన యుత్తరాయణశుక్లపక్ష దివా
ప్రాహ్ణ పూర్ణిమా రాకలవలన సూర్యబ్రహ్మలోకంబులందుం జేరి భోగావ
సానంబున స్థూలోపాధి విశ్వుండై సూక్ష్మంబునందు లయించి సూక్ష్మోపాధి
ద్యోతకుండై తైజసుండయి సూక్ష్మంబును గారణంబునందు లయించి కారణంబును
సాక్షిస్వరూపంబునందు లయించి తురీయుండై సాక్షిలంబునందు శుద్ధాత్మం
డై యివ్విధంబున ముక్తుండగుచు॥ గీ॥ అమరనిర్మితంబులైన యివ్విపిత్రు దేవ।

ద్వ్యాండనైన నేను సౌందర్య చాతుర్య మాధుర్యగాంభీర్యాదిగుణంబులను దరులకుఁ బ్రియుండనై క్రీడించుచు నొక్కనాఁడు విశ్వస్రష్టలయిన బ్రహ్మలు దేవసత్రమనియెడి యాగంబులోన నారాయణకథలు గానంబుచేయఁ గోరి కొనప్సరోజనులను గంధర్వులం జీఁన ॥ గీ॥ క్రతువులోని కేగ గంధర్వగణములోఁ । గలసిపోయివిష్ణు గాథలచటఁ । గొన్నిపాడి సతులఁ గూడిమోహితుఁడనై । తలఁగిచనితినంత ధరణినాథ । క । వారిజగంధుల పొత్తున । వారింగైకొనఁ దలఁగి వచ్చినబుద్ధి । న్వారెఱిఁగి శాపమిచ్చిరి । వారింపఁగరా నిరోషవశమున సత్రిపా ॥ గీ॥ పంకజాక్షు నిచట బాడక కామిని । గుణముగూడిచని సకల్మషమున । దత్త కాంతివగుచు ధరణితలంబున । శూద్రజాతిసతికి సుతుడవగుము॥వ॥అనియిట్లువిశ్వస్రష్టలు శపించిననొక్క బ్రాహ్మణదాసి కుత్రుఁడనై జన్మించియందు బ్రహ్మవాదులైన పెద్దలకు శుశ్రూషణజేసినభాగ్యంబునని మ్మహాకల్పంబునందు బ్రహ్మపుత్రుండనయిజన్మించితిగిగీ కౌశలమునమోక్షగతికిగృహస్థుడే। ధర్మమాచరించితగిలిపోవు।నట్టిధర్మమెల్లనతివిశదంబుగాఁ । బలుకబడితె నీకు భవ్యచరిత ॥ మ ॥ అఖిలాధారుఁడ జానె మర్థభుండుబ్రహ్మంబె విష్ణుండనీ। ముఖమందర్శితుఁడై వాసగతుఁడై మాధుర్యవంభాషియై । సఖియై చారకుఁడై మనోదయితుడై సంబంధియై మంత్రియై ॥ సుఖదుండై యెవ్వఁడు ధన్యతమహిమ దాజోద్యంబు ధాత్రీశ్వరా ॥ వ ॥ అనియిట్లు నారదుడు చెప్పిన వృత్తాంతంబంతయు విని ధర్మనందనుండు ప్రేమవిహ్వలుండయి వాసుదేవుని బూజించె నాడు దేవ ధర్మనందనుల చేత బూజితుండయి నారదమునియు దేవమార్గంబునం జనియెనని శుకయోగీంద్రుండు పాండవపౌత్రునకుం జెప్పెనని సూతుండు శౌనకాదులకుం జెప్పె॥

క॥ రాజీవసదృశలోచన। రాజీవభవాదిదేవ రాజవినుతని । భ్రాజిత కీర్తుల తావృ రాజీవభవాండ భాండరఘుకులతిలకా॥

మాలిని ॥ ధరణిదుహితృరంతా ధర్మమార్గనగంతా ॥ నిరుపమనయవంతా నిర్జరారాతిహంతా । దురుబధసుఖకర్తా కుభిసీచక్ర భర్తా । సురభయపరిహర్తా సుస్థిరకేతోవిహర్తా॥

గద్యము. ఇది శ్రీపరమేశ్వర కరుణాకలిత కవిచిత్ర కేసనమంత్రిపుత్ర సహ
జపాండిత్యపోతనామాత్య ప్రణీతంబయిన శ్రీమహాభాగవతంబను మహా
పురాణంబునందు ధర్మనందనునకు నారదుండు హిరణ్యాక్షహిరణ్య
కశిపుల పూర్వజన్మవృత్తాంతంబు చెప్పుటయు హిరణ్యకశిపుదితి
సంవాదంబును సుయజ్ఞచరిత్రంబును యమసల్లాపంబును బ్రహ్మవర
లాభగర్వితుండగు హిరణ్యకశిపు చరిత్రంబును ప్రహ్లాదవి
ద్యాభ్యాసకథయును ప్రహ్లాదహిరణ్యకశిపుసంవాదంబును ప్ర
హ్లాదువచనంబు ప్రతిష్ఠించి హరినరసింహరూపంబున నావి
ర్భవించి హిరణ్యకశిపుని సంహరించి ప్రహ్లాదునకభ
యం బిచ్చి నిఖిలదేవతా నివహప్రహ్లాదాదిస్తూయమా
నుండై తిరోహితుండగుటయు త్రిపురాసురవృత్తాం
తంబును నీశ్వరుండు త్రిపురంబుల దహించుట
యు వర్ణాశ్రమధర్మ వివరణంబును ప్ర
హ్లాదాజగరముని సంవాదంబును నా
రదు పూర్వజన్మ వృత్తాంతం
బును కథలుంగల సప్తము
స్కంధము సమాప్తము.
శ్రీకృష్ణార్పణమస్తు

